ప్రత్తినూలుతో తయారైన జందెమునే బ్రాహ్మణుడు ధరింపవలెను అని. ఇట్లనుటచేత పట్టు ఊలు నైలాను దారములు జందెమునకు పనికిరావు.

దేవలమహర్షి =

"శుచౌ దేశే శుచిః సూత్రం సంహతాంగులిమూలకే। ఆవర్త్య షణ్ణవత్యా తత్త్రిగుణీకృత్య యత్నతః॥ అబ్లింగకైస్త్రిభిః సమ్యక్ ప్రక్షాళ్యోర్ధ్వవృతం త్రివృత్। అప్రదక్షిణమావర్త్య సావిత్ర్యా త్రిగుణీకృతం॥ తతః ప్రదక్షిణావర్తం సమం స్యాన్నవసూత్రకం। త్రిరావేష్ట్య దృఢం బధ్వా బ్రహ్మవిష్ణ్వీశ్వరాన్నమేత్॥

స్త్రీలు వడికిన నూలును, శుద్ధమగు చోటున పవిత్రమైనవాడై కూర్చొని, బొటనవ్రేలు తప్ప, మిగిలిన నాలుగు ఎడమచేతివ్రేళ్ళను దగ్గరగ చేర్చి, వాటిమొదట తొంబదియారు సారులు మరల మరల చుట్టవలెను. అట్లు నూటతొంబదిరెండు బెత్తలుగ చుట్టిన దారపు కొనను, కుడిచేతికి తగిలించి, రెండుపేటలుగా చాలా జాగ్రత్తగా మధ్య మధ్య తెగకుండ చుట్టవలెను. అది పూర్తికాగనే ఆరెండుపేటల కొనను ఎడమచేతికి తగిలించి, ముప్పేటలుగ (త్రిగుణముగ) చేసి చుట్ట వలెను. అట్లు తయారైన దానిని తెనుగున "వత్తి"యందురు. ఆవత్తులను ఆపోహిష్ఠాదినవవాక్యములు చెప్పుచు బాగుగ తడపవలెను.

ఎట్లు? ఇట్లు. ఎడమచేతిలో వత్తులను ఉంచి, పై మంత్రములు చెప్పుచు వానిమీద నీళ్ళను చల్లుచు కుడిచేతివ్రేళ్లతో చాలమెల్లగ కొట్టుచు బాగుగా తడియునట్లు చేయవలెను. అట్లు తడిసినదానిని ఎడమచేతి నాలుగువ్రేళ్లకు తగిలించుకొని "తాళ్లబిళ్ల" సాధనముతో ఎగపురిని వేయవలెను. ఇది అప్రదక్షిణావృత్తమగును. ఆంధ్రప్రదేశమున తాళ్లబిళ్లకు ఆదారమునుతగిలించి కాలిపిక్కమీదనుండియో,

లేక తొడమీదనుండియో క్రిందనుండి పైకి ఎగఁద్రోయుదురు. అట్లుగ పురివేసిన వత్తులను బాగుగ రెండనిచ్చి, వానిని మరల మరియొకరి సాయముతో, గాయత్రీమంత్రమునుచ్చరించుచు ముప్పేటగా చేసి, దానికి దిగపురి వేయవలెను. అనగా-ఆదారమును తాళ్లబిళ్లకు తగిలించి, ఆ తాళ్లబిళ్లను తొడమీదనుండి క్రిందకు దిగఁద్రోయవలెను. లేదా ఒకకొసను తాను పట్టుకొని మరియొకకొసను తాళ్లబిళ్లకు తగిలించి, ఇంకొకనిచేత దిగపురి యగునట్లు రెండుచేతులతో త్రిప్పింపవలెను. ఇది ప్రదక్షిణావృత్తమగును. ఇట్లు దిగపురి వేయబడిన దారమునందు, తొమ్మిది దారము (పోగు) లుండును. దారమునకు ఆపురి బాగుగ పట్టుటకొరకు కొంతసేపుంచి, తర్వాత దానిపురిని కొంచెము తగ్గించి, ఆదారమును, కూర్చున్న తనకాలి రెండుముడుకులను పైకియెత్తి, కొంచెము దూరము చేసి వాటికి వెలుపల, మూడుసారులు చుట్టవలెను. లేక— ఇంకొకరియొక్క—, ఎడముగ చాపిన చేతులకు వెలుపల మూడుసారులు చుట్టి, రెండు కొనలను చేర్చి లంకెవేసి ఆ మూడుపేటలమీదనుండి ఒకటి రెండు సారులు త్రిప్పి పెనవేసి ఓంకారమునుచ్చరించుచు సంప్రదాయానుసారముగ బ్రహ్మముడి వేసి బ్రహ్మవిష్ణ్వీశ్వరులను నమస్కరింపవలెను. ఇది జందెము తయారుచేయు పద్ధతి.

# రెండవ అనుబంధము

## 159వ పుటయందలి పవిత్రవిషయము

స్మృతిముక్తాఫలమున=

> "తర్జన్యా బిభృయాద్రౌప్యం స్వర్ణం చోపకనిష్ఠయా।
> దక్షానామికయా విప్రో బిభృయాద్గ్రంధిసంయుతం॥
> యజ్ఞోపవీతే మౌంజ్యాం చ, తథా కుశపవిత్రకే।
> బ్రహ్మగ్రంథిం విజానీయాదన్యత్ర తు యథారుచి।।

చూపుడువ్రేలియందు వెండిపవిత్రమును అనామికయందు బంగారపుటుంగరమును ధరింపవలెను. బంగారపుపవిత్రపుటుంగరమును కుడిచేతియనామికయందే ధరింపవలెను. జందెమునందును మౌంజిత్రాటియందును కుశపవిత్రమునందును బ్రహ్మగ్రంధి(ముడి)నే వేయనలెను అని. కుశపవిత్రశబ్దము బంగారుపవిత్రమునకు సూచకము.

బంగారుపవిత్రపుటుంగరమును చేయించుటకు ఎంత యెత్తు బంగారము కావలెనో శంఖమహర్షి చెప్పుచున్నారు.

"సువర్ణస్య సువర్ణస్య సువర్ణస్యాంగుళీయకం।
పవిత్రమితి విజ్ఞేయం సర్వకర్మసు పూజితమ్॥

అనగా—ఐదు గురివిందగింజల యెత్తు=ఒక మాషము. పదునారు మాషముల యెత్తు సువర్ణమనబడును. ఈశ్లోకమున శంఖమహర్షి శబ్దచమత్కారమునుకోరి మూడు సువర్ణశబ్దములను వాడెను. మహర్షికి గూడ ధర్మప్రవచనమున సాహితీదృష్టి! అందు తొలి సువర్ణశబ్దము, పదునారుమాషముల యెత్తును చెప్పును. రెండవది మంచి వర్ణము (వన్నె) గలది, యని చెప్పును. అనగా పదునారవ వన్నె గలిగి శుద్ధమైనది, యని యర్థము. అందువలన 24 కారట్లబంగారము పనికిరాదు. ఇక మూడవది=బంగారమును చెప్పును. కాగ—పదునారు మాషముల యెత్తు గల, (ఇప్పటి $1\frac{1}{8}$ సవరను బరువు) పదునారవ వన్నెగల శుద్ధమైన బంగారముతో పవిత్రాకారముగ చేయబడిన ఉంగరము పవిత్రపుటుంగరమగును. ఇది యెల్ల వైదికకర్మల యందును శ్రేష్ఠమని భావము.

ఇప్పటి బంగారము వెలను మనసున నుంచుకొని, ఆకాలమున అడవులలో నుండెడు మునులు, ఇంతధనముతో బంగారమును కొని,

యెట్లు పవిత్రపుటుంగరమును చేయించుకొనెడివారో కదా! అని సందేహపడనక్కరలేదు. 1930వ సంవత్సరమునందు సవరను వెల పదుమూడు రూపాయలుండెను. మరి ఆ మునుల కాలమున ఎంత కారుచవుకగ నుండెడిదో యూహించుకొనుడు. అంతియేగాక, రాజులు ఆశ్రమములకు వెళ్లి మునులకు బంగారు పవిత్రపుటుంగరములను ప్రదానము చేసెడివారని పురాణములు చెప్పుచున్నవి.

వైదికకర్మలు చేయుటకు ఏదియేని యొక బంగారపుటుంగరమును కుడిచేతి యనామికకు పెట్టుకొనిన చాలునని ధర్మశాస్త్రము చెప్పుచుండుటవలన $1\frac{1}{8}$ సవరను బంగారముతోనే పవిత్రపుటుంగరమును చేయించుకొనవలెనని భయపడనక్కరలేదు. కేవలము లేని దానికంటె, యథాశక్తిగ చేయించుకొనవచ్చునని తోచుచున్నది. ధనమున్నవారు $1\frac{1}{8}$ సవరనుతో చేయించుకొనుడు.